శ్రీ విఘ్నేశ్వరాయ నమః.

# కుచేలోపాఖ్యానము

హరికథ

ఇయ్యది

విశాఖపట్టణముజిల్లా, అనకాపల్లి వాసుండగు

బీ. బాలాజీదాసునిచే

హరికథగా వ్రాయబడినది.

ప్రకటనకర్తలు :

కురుకూరి సుబ్బారావు అండ్ సన్,

ప్రొప్రయిటర్సు :

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

11 కూర్పు : 1000 ప్రతులు

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

1940

కాపీరైట్ రిజిష్టర్డు]

[వెల రు 0-6-0

శ్రీ విఘ్నేశ్వరాయ నమః.

# కుచేలోపాఖ్యానము

హరికథ

ఇయ్యది
విశాఖపట్టణముజిల్లా, అనకాపల్లి వాసుండగు
**బి. బాలాజీదాసుని చే**
హరికథగా వ్రాయబడినది.

ప్రకటనకర్తలు:
**కురుకూరి సుబ్బారావు అండ్ సన్,**
ప్రొప్రయిటర్సు:
సరస్వతీ బుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.

11 కూర్పు : 1000 ప్రతులు

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

1940

కాపీరైట్ రిజిష్టరు] [వెల రు 0-6-0

# ఆంధ్రదేశమందు అన్ని సమాజములవారిచే ప్రదర్శింపఁబడు నాటకరత్నములు.

| | |
|---|---|
| తంగూన్ రాడీ సో. రా. | 1-0-0 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము మ. అ. | 1-0-0 |
| పత్నీప్రతాప్ అను అనసూయ సో. అ. | 1-0-0 |
| శ్రీకృష్ణతులాభారము ము. సు. | 1-0-0 |
| భీష్మబ్రహ్మచారి (సంపూర్ణ భీష్మచరిత్ర) సో. రా. | 1-0-0 |
| బొబ్బిలియుద్ధము శ్రీ. కృ. | 1-0-0 |
| రాధాకృష్ణ పా. ల. | 0-12-0 |
| పాదుకాపట్టాభిషేకము డిటో | 1-4-0 |
| సత్యహరిశ్చంద్రీయము బ. ల. | 1-0-0 |
| రామదాసు బళ్ళారి డి. గో. | 1-0-0 |
| కృష్ణలీల బళ్ళారి పండిత కె. సు. | 1-4-0 |
| లవకుశ డిటో | 1-4-0 |
| మహాభక్తవిజయము సో. రా. | 1-0-0 |
| కాలకేతనము డిటో | 1-0-0 |
| సతీసక్కుబాయి డిటో | 0-12-0 |
| చంద్రగుప్త నం. శి. | 1-0-0 |
| విప్రనారాయణ పా. ల. | 1-0-0 |
| రాధాకృష్ణ సాంగ్సు చం. కే. | 0-12-0 |
| శ్రీకృష్ణతులాభారం సాంగ్సు డిటో | 0-12-0 |

వలయువారు :—కురుకూరి సుబ్బారావు & సన్

ప్రొప్రయిటర్సు :— సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ, కృష్ణాజిల్లా.

శ్రీరస్తు.

శ్రీ విఘ్నరాజాయ నమః.

# శ్రీ కుచేలోపాఖ్యానము

ఇయ్యది

విశాఖపట్టణముజిల్లా, అనకాపల్లి వాసుండగు

బి. బాలాజీదాసునిచే

హరికథగా వ్రాయబడినది.



ప్రకటనకర్తలు:

ఉరుకూరి సుబ్బారావు అండ్ సన్స్,

ప్రొప్రయిటర్సు,

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ, కృష్ణాజిల్లా.



11 వ కూర్పు: 1000 ప్రతులు.



బెజవాడ:

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1940.

కాపీరైటు రిజిష్టరుడు ] [ వెల రు. 0-4-0.

# హెచ్చరిక.

విజయనగర వాస్తవ్యులును, గానవిద్యా విశారదులును,
హరికథా పితామహులు నగు
బ్రహ్మశ్రీ ఆదిభట్ట నారాయణదాసుగారిచే రచియింపబడిన

## హరికథలు.

ఈ క్రింద నుదహరించిన పుస్తకములయొక్క సర్వహక్కులు
మేము గైకొని ప్రచురించినాము.

| | | | |
|---|---|---|---|
| 1. | జానకీశపథము | ... ... | 1_ 0_0 |
| 2. | రుక్మిణీ కల్యాణము | ... ... | 0_12_0 |
| 3. | మార్కండేయ చరిత్రము | ... ... | 0_12_0 |
| 4. | హరిశ్చంద్రోపాఖ్యానము | ... ... | 0_12_0 |
| 5. | అంబరీష చరిత్రము | ... ... | 0_ 8_0 |
| 6. | భీష్మచరిత్రము | ... ... | 0_ 8_0 |
| 7. | గజేంద్రమోక్షము | ... ... | 0_ 8_0 |
| 8. | ప్రహ్లాదచరిత్రము | ... ... | 0_ 8_0 |
| | పై యెనిమిది పుస్తకములు కలసిన క్యాలికో బైండు | ... | 5_ 8_0 |

దొరకు వారు:—

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ,
కృష్ణా జిల్లా.



ఓం నమస్తే.

# కుచేలోపాఖ్యానము.

ఉ॥ శ్రీలనొసంగి సత్కరుణచేత గుచేలునిగాచె నే దయా
శాలి ప్రబుద్ధుఁడై విదురసన్నిధి విందుల నారగించె పాం
చాలికి రాచకొల్వున నొసంగె దుకూలము లట్టి వేణుగో
పాలు బుధానుకూలు వ్రజబాలు మదారివిఘాలు నెంచెదన్.

## గురుస్తుతి

క॥ తగ నాంధ్రభాష గరపిన । తగవరి పోట్నూరికులసుధావార్ధివిధుం
డగు వెంకటసామి మదీ । యగురుని మదిలో దలంతు ననవరతంబున్॥

## వంశావళి

సీ॥ ఫలసస్యవృద్ధి సద్వ్యాపారములచేత మను నక్కపల్లి గ్రామ నిల
యుండ । గుప భరద్వాజసగోత్ర ప్రపావనప్రభుడు లక్ష్మణదాసు
పౌత్రకుండ । రహిమీర కేశవరామాఖ్యునకు గన్నమాంబకు నే
ద్వితీయాత్మజుండ । విశ్రుతగానప్రవీణుఁడౌ బాలాప్రసాదుగారికి నే
సహోదరుండ ।

గీ॥ శైలజాహృదయాబ్జ భాస్కరకటాక్ష
వీక్షణప్రాప్త గాన కవిత్వయుతుఁడ
శ్రీరమేశకథా బోధనారతుండ
నరయ బాలాజిదాస నామాంకితుండ॥

# కథాప్రారంభము.



జంఝూటి — త్రిశ్రగతి.

వినుడి నేస్తులారా! నా | మనవి వీనులారా ॥విను॥

ఘనుడు కుచేలుం డను పా|రుని చరితము హృతదురితము ॥విను॥

ధరణీభారము దీర్పం|దలచి దేవకీదేవి యు

దరమున బొడమి యశోద|దరి బెరిగిన కృష్ణసఖుడు ॥విను॥

వ॥ శ్రీకృష్ణుని యనుంగుచెలికాడగు కుచేలుడు.

సీ॥ నందసూనునితోడ సాందీపునొద్ద ప్రాజదువులు శాస్త్రముల్ చదివి నాడు|అమితోపవాసమ్ము లతి భక్తితోడగావించి తా జాల కుమిక్కం చినాడు | మహిలో గృహస్థుడై మనుటమేలని యొక్క యెన్ను మిన్నను బెండ్లియాడినాడు | లకురంధ్రముల చేలమును దాల్చి కుచే లుడను సార్థకాఖ్యచే దనరినాడు॥

గీ॥ చుట్టుపక్కలగల జన్నిగట్టులెల్ల
పరమభక్తు డీతం డని పలుకుచుండ
హరిపదాధీనమానసుడై నిరంత
రమ్ము మునిపల్లెలో నివాసమ్ము జేసె.

వ॥ బాల్యమున సాందీపునొద్ద కృష్ణునితోగూడ ఋగ్యజుస్సా మాథర్వాణంబులను, వేదచతుష్కమ్మును, దర్క వ్యాకరణ ధర్మ మీమాంస వైద్య జ్యోతిశ్శాస్త్రమ్ములను శాస్త్రషట్కమ్మును, బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భవిష్యోత్తరము, బ్రహ్మ కైవర్తము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, లైంగము, స్కాందము, మత్స్యము, కూర్మము, వరాహము, వామనము, గారు డము, బ్రహ్మాండ మాదిగాగల పదునెనిమిది పురాణములను జదివిన పుణ్యపురుషుండు.

శ్లో॥ అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ హ్యవంతికా
పురీ ద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయకాః॥

వ॥ అను ప్రమాణముఁ దోప్పున మోక్షప్రదాయకములైన పురములలో నొక్కటియైన మధురాపురమునకు గొంతదూరముననున్న యవంతి యను నగరమునకు సమీపంబున నొక మునిపల్లెలో నివసించి హరినామసంకీర్తనం బొనరించుచు నూరువేలతూంట్లు గల పురాణవస్త్రమునుధరించి కాలముదోయుచుండె. వీరినడకలెట్టివనిన, శరీరాలంకారము నపేక్షించువారు వస్త్రాభరణాదులు గోరుదురు. భాగవతశిఖామణులకు.

నాదనామక్రి - చతురశ్రగతి.

అదియే భూషణము సజ్జనులకు ॥నది॥
వదలని సూనృత । వ్రతము బూనిన ॥నది॥
అన్యక్షేత్రపురంధ్రీరత్న ధన।ధాన్యాదులవాంఛ దగులని వారి ॥నది॥
ఆలుబిడ్డలు మిథ్య । యని మదిలో దలంచి
బాలాజీవరదుని । బ్రస్తుతించువారల ॥నది॥

వ॥ కావున కనపడునది యెల్ల కల్లయనియెఱింగి ప్రజ్ఞావంతుడగు కుచేలుండు "శ్లో॥ యే కంఠలగ్నతులసీనళినాక్షమాలాః। యే బాహుమూలపరిచిహ్నిత శంఖచక్రాః। యేతే లలాటఫలకే లసదూర్ధ్వపుండ్రాః। శ్రీవైష్ణవా భువన మాశు పవిత్రయంతి" అను ప్రమాణము దోప్పున భాగవతచిహ్నముల ధరించి జీర్ణచేలోపేతుడౌట నచటివారలు కుచేలుండని పిల్చుచుండ బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాసమ్ములను నాలుగు ఆశ్రమములందు గృహస్థాశ్రమ ముత్తమమైనదని యెంచి 'కామిగాక మోక్షగామికాడు' అని భాగవతమున జెప్పిన చందమున గృహస్థాశ్రమము వహింపగోరి 'భార్యామూల మిదం గృహమ్' అని యున్నదిగనుక సుశీల యను నొక్క కన్యారత్నమును బరిణయంబై యిరువదేడ్గురు మగబిడ్డలం గని నిరుపేదయై దారాధనపు

త్రేషణముల జయించి కర్దమకీటన్యాయంబున సంసారమందుండి తరించుట మేలని ప్రొద్దుగడుపుచు "శ్లో॥ ఋణం యాచ్నాచ వృద్ధత్వం జారచోరదరిద్రతా। రోగశ్చ భుక్తశేషశ్చా ప్యష్టకష్టా ప్రకీర్తితాః" యనునట్లు యాచించుట మిక్కిలి హీనము గనుక బ్రాహ్మణులకు యాచించుట ఆచారమైనను కుచేలుండయాచకుడై.

తో॥ అనుదిన మడవికి జని దూసరధా।న్యమ్ము పిడికెడు గ్రహించి
అనుగుబడంతికి నిడ నాసతి బి।య్యం బగునట్టుల దంచి
అతివ పచనంబొనర్చి యందు సగ। మతిథులకు సమర్పించు
బతియు దాను తనబిడ్డలు తక్కిన। భాగమ్మును భుజియించు.

వ॥ ఈతెరంగున కాలము ద్రోయుచుండిరి. కాని వా రార్జించిన బియ్యమువలన నయినయన్న మొక్కనికైన చాలని దిసవదేద్గు రనుభవించుట దుస్తర మతిథులకు బెట్టుకున్న నేమి యన.

తో॥ ధరణి దానముల నార్తజనాభయ। దాన మరయ మొదటిది
తరచి తరచి మదిలో నారయ వి।ద్యాదానము రెండవది॥

తోడి - రూపకము.

అన్నదాన మొకటి మంచిది। యోజించిజూడ ॥నన్న॥
ఎన్నిదానముల జేసిన। నెవ్వాడు తృప్తిపడడో వానికి
నన్నము పూర్ణముగ నిడిన। నంతనె తృప్తుండై చను ॥నన్న॥
నిరతము సజ్జనసేవా। నియతి తటస్థించువాడు
కరుణబూని దీపించిన। కడకు మోక్షము లభించు
ధరణిని దశదిశలయందు। దప్పక సత్కీర్తిహెచ్చు
నరయు దాస బాలాజీ। వరదుని సత్కరుణవచ్చు ॥నన్న॥

వ॥ కావున నన్నదానముచేయుట చాలమంచిది.

"సీ॥ కెలకులనున్న తంగెటజున్ను గృహమేధి యజమానుడంకస్థితార్థ
పేటి। పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు దొడ్డిపెట్టిన వేల్పుగిడ్డి

కావు | మరుదేశపదమధ్యమ ప్రపకులపతి యాకటికౌదవుసస్యము కుటుంబి | కడలేని యమృతంపు నడబావి సంసారి సవిధమేరు నగంబు భవనభర్త |

గీ॥ బధిరపఙ్గ్వంధభిక్షుక బ్రహ్మచారి
జటిపరివ్రాజి కాతిథిపతి కృపణ కావ
ధూతకాపాలి కాద్యనాథులకు గాన
భూసురోత్తమ గార్హాస్థ్యమునకు సరియె॥ ,,— మనుచరిత్ర.

వ॥ బ్రహ్మచారి వానప్రస్థసన్న్యాస్యంగహీనాతిథ్యభ్యాగతుల క్షుద్బాధనివారణము గృహస్థుడు చేయవలెను. కావున "పేదవడి యును నర్థికి బ్రియముతోడ | దనకుగలభంగి నిచ్చునతండు పుణ్య | పురుషు డని చెప్పిరార్యులు బుధవరేణ్య" అన్నట్టు నిరుపేదలైనను కలిగినదానిలో నగమిచ్చుచు కాలముద్రోయుచుండ నిరుగుపొరుగు పిల్లలను తనబిడ్డలు గాంచి తమకును నాతెరంగున కావలెనని యేడ్చుచు తల్లిని జూచి.

ఫీలూ — త్రిశ్రగతి.

బువ్వబెత్తవే | అమ్మా | ॥బువ్వ॥
బువ్వబెత్తకున్న నేడు | రవ్వసేయకమాన చూడు ॥బువ్వ॥
బులుసువారి చిన్నబ్బాయి | పిలువవచ్చినాడుచూడు
పలకపుత్తకములనిమ్మ | బడికిపోయి చదువుకుంత ॥బువ్వ॥
బిక్కవిల్లివారి లచ్చు | చక్కనినగలు బెత్తింద
యొక్కతి అడిగిచ్చి నా | మక్కువదీర్పు మాయమ్మా ॥బువ్వ॥
పప్పువారి గోవిందయ్య | పప్పుబెల్లములు తెమ్మని
మప్పినాడుగాన నాకు | యిప్పు డిచ్చిపంపించవే ॥బువ్వ॥
కోరిమిల్లివారిపిల్ల | కోతు లాగు తొడుగుతుంది
చీరెచెంగుచించి నాకు | చిన్నకోతు కుత్తించమ్మా! ॥బువ్వ॥

జంఝూటిరాగం - రూపకతాళం.

అయ్యో నా బిడ్డలార । అల్లరులిడబోకు ॥అయ్యో॥
వెయ్యారులు సెప్పనేల । విడువుడు మీశోకము ॥నయ్యో॥
శోకింపవలదు మీ, కడుఁపుబ్బగ
దాకులపడనేల నాకలిదీర్చెద ॥నయ్యో॥
పిండివటంబు రాత్రికి మీ । తండ్రి తెచ్చినపుడు కడుపు
నిండ దినవచ్చు నూర । కుందుడు మీరంతవరకు ॥నయ్యో॥

వ॥ ఈగతినోదార్చి మిగుల పరితపించుచు ప్రియునాలోకించి.

కీరవాణి - చతురశ్రగతి.

ఏమని దెల్పుదు బిడ్డలగోరము ॥యే॥
రామానుజు డెరుగు నా ప్రాణనాధ ! ॥యే॥
జ్ఞానాధికు లవుటచేత నీ సం।సారబాధ లెన్నడు తలపెట్టరు
సూనులు వడు నిక్కట్లు దేవకీ।సూనునికే తెలియంగల వయ్యో ॥యే॥
బాపకులకు యాచించుట స్వభా।వంబైనను మీ రది మదినెల్లరు
కోపింపవలదు నే నిప్పుడు క।ుక్కుర్తి మాటయొక్కటి పల్కెద ॥నేమ॥

వ॥ హా పరమేశ్వరా! పిల్లలబాధచూచి యెట్లోపుదు? (ప్రియునిజూచి)

సీ॥ నీచకార్యమ్ముల నాచరింపగ జేయు గురుదుఃఖవార్ధిని ద్రుంగద్రోయు।
పొలతులమగలనుబోరాటమాడించు ససమానరూపము న్వెసనడంచు।
పగవారినైనను బ్రీతిమాలుటకు దెచ్చు సూనృతవాక్యము
లుచ్చరబుచ్చు । సంతోష మనుదాని సమయింప సమకట్టు కడు
తృష్ణయనుఁటొంప మెడనుగట్టు ।

గీ॥ బూటకపుబుద్ధి పుట్టింప బుట్టినిల్లు
ధైర్యలక్ష్మిని వెడలింప దనకె చెల్లు
అరిజనులకైన నీబాధ లంటరాదు
వసుధలో లేమికన్న పాపంబులేదు.

వ॥ కావున నీ దారిద్ర్యం బనుభవింప దుస్తరము. దయయుంచి.

నాదనామక్రియ — రూపకము.

నామనవి వినుమయ్య । నగధరభక్త! విరక్తా! ॥నామన॥
యేమని తెల్పుదును బిడ్డ । లేడ్చెడిచందము వినదోపదు నాడెందము॥
ఇరుగుపొరుగుపిల్లల గని । పెరుగుపాలునిమ్మని
మొరలిడుచుండగ నే విని । బుజ్జగింప వినరో ముని ॥నామ॥
పిన్నవాండ్రకు గట్టినట్టి । చిన్నపాలపూసలెకాని
చిన్నమెత్తు బంగారమైన । చిరుతులకు లేదుగ మౌని
యెన్నడైన పిండివంట । లెరుగరు వా రకటకటా
యున్నది లేనిది మనమున । నూహింప రేమందు ॥నామ॥

తో॥ ఏపగిదిని కాలము గడిపితినో । యెరుగు దేవు డిటుమీద
బాపలుపడియెడి శ్రిమలుజూచి యోర్వగజాల నల యశోదా
తనయుడు మీ సఖుడని వింటి నా । తని ద్రవ్యమడిగి నాథ!
తనయుల నన్ను బోషణజేయుడు । తప్పదు మీ కీ బాధ॥
వ॥ ఈగతి సుశీల తనయభిప్రాయమును వెల్లడింప పారుండు నవ్వి.

అరభి — చతురశ్రగతి.

మును తా నొనరించిన కర్మఫల । మనుభవింపకతీర దబలా ॥మును॥
వినుమా యనుమానింపగవలసిన । పనిలే దిది నిశ్చయమో అబలా
చేతబట్టినది పసిడికొండ । ప్రీతితోనున్నది వెండికొండ
ఖ్యాతిజెందిన కుబేరుడు తన సంగాతియై యుండ గౌరీప్రియుండు
ధాత కపాలము బూని బిచ్చమెత్తగవలసెను గావున వినుమో వ
ధూతిలకమా బాలాజీవరదునకైనగాని తప్పదు తప్పదు ॥మును॥

చ॥ కనుగొను రాతియందు చల కప్పలకు జ్జలజంతుకోటికి
వనకుహరప్రదేశముల వర్తిలుచుండు మృగాళి కన్నమే
ఘను డిడుచుండునో యన జగన్మయు డీశ్వరు డుండ బిడ్డలకి
మనుపగ నే నెవండ వినుమా! యనుమాన మదేల మానుమా॥

వ॥ మఱియు

సీ॥ జనియించు మరణించు జనుల జూచుచునుండు, వబల యీదేహమ్ము లస్థిరమ్ము। లాలుబిడ్డల నెల్ల బాలింప దలపాగ,లను మార్చి సమగూర్చరాదు సొమ్ము। విత్తమ్మునార్జించి విఱ్ఱవీగగరాదు, మన వెంటరాదది మాటనమ్ము। సంపద లరయ మిూసాలపైగల తేనె, గవ్వకైనను కొరగావు సుమ్ము।

గీ॥ ప్రియసుతాంగనాలయములు ఋణముచే ల
భించు నిక రిక్తకోరిక లెంచనేల
లబ్ధమగు దానితోడ కాలక్షేమనుకూల
ముగను తోయుట మంచిది సుగుణశీల.

వ॥ ప్రియసీ! మన మనుభవింపవలసినవి అక్కరలేదన్న పోనేరవు. పెట్టిపుట్టనివి రానేరవు. కనుక మనకు సంప్రాప్తమైన దానితో సంతోషించుట మిగులమంచిది. "అసంతుష్టో ద్విజో నష్టః" అనునట్లు, "సంతోషి కాడేని శక్రుడైన నశించు"నని భాగవతమున చెప్పిన రీతి దేహము నశించుటేగాక ఆత్మయు నశించును. కావున పేరాస కూడదని విరక్తుడై పలుక లక్కాంతామణి భర్త నాలోకించి.

శంకరాభరణము — రూపకము.

ఎక్కడిమాట నాసామి ॥యె॥
అక్కరతో పురుషప్రయత్న।మాచరింపక వచ్చున దైవమిచ్చున॥యె॥
ధరణిని దున్ని మంచివి।త్తనములు చల్లిన నటుపై
వారి సాహాయ్యమున వర్షించిన।నదియు పండు నటుగాకున్న నెండు॥ నె॥
స్వామియిచ్చునని నట్టింట కి।వాచి వేసకొని
నేమముతో గూర్చున్నప్పటికి।నీరదశ్యాము డీయ డెప్పటికి ॥ నెక్క॥

వ॥ కావున పురుషప్రయత్న మవసరం. మట్టుపై హరికృప చూడుడు. గజేంద్రాదు లవసరమునుబట్టి వేడినగదా పరమేశ్వరుండు వారల గాపాడెను. దయయుంచి విధిగా నా ప్రార్థన నంగీకరించి కృష్ణుని దర్శించి ధనము యాచించి మమ్ములగాపాడుండన సుశీల పల్కులు కుచేలుండు విని "ఆనందో బ్రహ్మే"యను వాక్యమును దలంచి హరిని

సేవించుటకును బిడ్డలకా పాడుటకును "పరమార్థమును అర్థమును" లభించునట్లు మంచిపని తటస్థించినదని భార్యనుజూచి, సుందరీ! నీమాటల కొడంబడితినిగాని యం దొక విశేషముగల దద్దాని వివరించెద వినుము.

కమాచి - చతురశ్రగతి.

ఇందీవరాక్షీ వినవే । యిపుడేమైన నాచేతికిచ్చి పంపవే యో ॥యిం॥

నందసూనునిదర్శనముచేసి వచ్చెద
నిందిరాధిపు డేమైన । నిచ్చిన దెచ్చెద ॥నిం॥

నిరుపేదలు ధనికుల చెంతకు
నరుగరా దొకవేళ । నచటికి బోయిన
గురుఫలపుష్పముల । కొనిపోవలె రిక్త
కరములతో బోవ । గా రాదందురు
గరిత మిన్న శ్రీకృష్ణుడు నొకసం।గాతి, పార్థివుం డల బాలాజీ
వరదుండగు దేవదేవు డాతని దరికిం బోవరాదు వట్టిచేతులతో ॥నింద॥

శ్లో॥ "అగ్ని హోత్రం గృహం క్షేత్రం గర్భిణీం వృద్ధబాలకౌ
రిక్తహస్తేన నోపేయా ద్రాజానం దైవతం గురుం.

వ॥ కావున దేవుని దర్శించునపు డుత్తచేతులతో బోరాదు. శ్రీకృష్ణునకు దృప్తియగున ట్లీయగలమా? కొండంతదేవుని కొండంత పత్రితో బూజించుచున్నారా? నదీనదముల కాధారమైన సముద్రము మంచుబిందువులచేత నిండునా? చంద్రునకు నూలుపోగను సామెతవలె మనశ్శక్తి ననుసరించిభక్తిపూర్వకముగా సమర్పింపవలెకాన యోజింపు" మన నా సతీతిలకము కొన్ని దినము లుపవాస మొనర్చి తనవంతునకు వచ్చిన ధాన్యము నటుకులగునట్లు దంచి మగనికింగల జీర్ణాంబరమున గట్టి పంప నాకుచేలుం డాయటుకులమూట భద్రముగా బట్టుకొని పరమహార్ష మున.

ఆనందభైరవి - రూపకము.

సకలేశ్వర నిన్ను నమ్మినానురా । సరగున ననుగావరా ॥సక॥
వికసితాబ్జపత్రినేత్ర । విమలయదుకులపవిత్ర
శుకమునిముఖస్తోత్రపాత్ర । సూరిజనహృదయాబ్జమిత్ర మే
చకసురుచిరగాత్ర శ్రీ । జానకీకళత్ర
చకిత దనుజరాజీ । సంరక్షితబాలాజీ ॥సకల॥

వ॥ ఇట్లు హరిని భావింపుచు మునిపల్లె విడచి ఘోరాటవులం బ్రవేశించి యెండలకు శోషించి చెట్టునీడలయందు నిలుచుచు ద్రోవతప్పి చనుచుండునప్పుడు నడువలేక కుంటుచు ఆహారములేక రాత్రులు సమీప గ్రామములగల యిండ్లతిన్నెలపైని నిద్రబోవుచు నిలువెడలినదినములు లెక్కింపుచు కాల ముల్లునాటగా మిగులకష్టముతో మనమ్మున.

ధన్యాసి - చతురశ్రగతి.

అతిపలమాటలు విన్నవారలకు । హానిరాకపోదు ॥అతి॥
మతిహీనుడనై సతిమాటలు విని । మహాటవులజిక్కులు పడు
చున్నాడ ॥సతి॥

అసువులవిడచెను దశరథుడు తన । యాలు కైకవలన
పసుపుగుంకముల కెడమయ్యె కైక । పాపదాసివలన
రసికుండగు రావణుండీల్గె సూర్పణఖబోధవలన
నిసువుబాసె నుత్తానపాదు డను । నేలఱేడు భార్య సురుచివలన ॥అతి॥

వ॥ "శ్లో॥ ఆత్మబుద్ధిస్సుఖంచైవ గురుబుద్ధిర్విశేషతః । పరబుద్ధిర్వినాశాయ స్త్రీబుద్ధిః ప్రళయంకరీ॥" అను నీతిశాస్త్రము చొప్పున స్త్రీలబుద్ధి విన్న చేటువచ్చునను నది తెలిసియు వచ్చినాడను. "బుద్ధిజాడ్యజనితోన్మాదులుల్లదా శ్రోత్రియుల్". యింకను ద్వారక యెంత దూర మున్నదియో! సముద్ర మెట్లుదాటుదు? ద్వారక కేగతిబోవుదు? పోయిన జక్రవర్తులకైన జేరనలవిగాని కృష్ణనగరద్వార మేగతి జేరుదు? చేరిన బ్రహ్మరుద్రేంద్రాదులకు సేవింపరాని గోపాలునిసేవ యెట్లుగలు

గును? కలిగినచో కృష్ణుండు బాల్యస్నేహము తలంచునో తలంపడో? ఒకవేళ తలంచి యాదరించిన నన్నికోరికల నిచ్చెడి కల్పవృక్షముచెంత జేరి ధనధాన్యాదులు యాచింపక పచ్చికాయ లడుగు తెరంగున మోక్షప్రదాత యగు వాసుదేవుని దర్శించి చిదానందపదవి గోరక యనిత్యమగు ద్రవ్యము నడుగవలసి వచ్చినదని డోలాయమానమాన సుండై చనిచని నావికులను మంచిమాటలాడి సముద్రమును దాటి శ్రీకృష్ణనగర ద్వారముచేరుగ జేరి ద్వాదశోర్ధ్వపుండ్రతులసీ నలినాక్ష శంఖచక్రధారులగు ద్వారపాలకుల గాంచి.

అఠాణా - రూపకము.

ఎంతధన్యులయ్యా మీ ‖ రెంత‖
దంతిరక్షకుని భవ । ద్వారపాలకులైతిరి మీ ‖ రెంత‖
ఏజన్మంబున శ్రీహరి । పూజలు గావించితిరో
యీజన్మంబున మీకు । నిట్టిభాగ్యమబ్బెను రా
రాజులైన దొలి మీ । దర్శనముజేసి కదా పిదప
రాజీవాక్షుం డగు బా।లాజీవరదుని జూచుట ‖ ఎంత‖

వ॥ ఇట్లు ద్వారపాలకుల గొనియాడి వారల దీవించి.

తో॥ నాపేరు కుచేలుడు కృష్ణుని పి♦న్ననాటి సంగడికాడక్
భూపాలునితో విద్యలు సాందీ♦పునిదరి జదివినవాడక్
ఇందిరాధిపుని దర్శనార్థమై ♦ యే నరుగుదెంచి తిపుడు
నందనందనునితోడ దయయుంచి ♦ నారాక వెస దెలుపుడు॥

వ॥ ఈ విధమున గుచేలుండు పలుక నందు కొందఱతని వికృత రూపమును, పోవు పోకలును జూచి నవ్వుచు సమీపించి.

ధన్యాశి - ఆదితాళము.

వచ్చినమార్గమునుబట్టి వేగము । పదవోయి బాపడా॥ ‖వచ్చి‖
లచ్చిమగని జూచుటకై యెంతటి । ముచ్చటతో విచ్చేసితి వహహా॥వ॥

మోక్షదాయకుండగు హరి యేడ । ముసలికోతివలె నున్న నీవేడ
నిక్షురు డగుహరిని నిన్నుజూడ । హస్తిమశకాంతరము గద మూఢ ॥వ॥

వ॥ సరి సరి యెంతసులభముగా హరిని దర్శింపవచ్చితివి. "నక్కయెక్కడ దేవలోక మెక్కడ" నన్నట్లు కృష్ణునకు నీకు నంత తారతమ్య మున్నది. దేవతలకైన సేవింప నలవిగాని వాసుదేవుం డెట్లు దర్శనమిచ్చును? గొంతెమ కోరికలు మాను మఁదియునుగాక రాజ్యోన్నతుడై యున్న శ్రీకృష్ణునకు నీవు జ్ఞప్తికి వత్తువా? రాజులసంగతి కొంతవరకు జెప్పెద నాలకింపుము.

సీ॥ మేలుగావించిన మిత్రులుదర్శింప, నేతేరవారిగన్నెత్తి కనరు। పాలి
యింతు రన్నదమ్ములనైన రాజ్యేచ్ఛ, మంచిచెడ్డలనుయోచించిమ
నరు। చెడుకార్యములకు ముందడుగుపెట్టుచెకాని, పుణ్యకార్యము
లన్న బూనుకొనరు । నీతికోవిదులైన నీవంద్రు మీరన్న, మాట
స్పష్టమ్ముగా నోట ననరు ।

గీ॥ వారలను జుట్టుకొన్న గర్వంబు పోదు
చెలిమి మోమోటములు భూవిభులకు లేదు
పార్థివుల దెప్డు ధన్యజీవనము కాదు
నరపతుల స్వప్నమందైన నమ్మరాదు.

క॥ కనఁ గనులున్నను గ్రుడ్డియు
వినఁ జెవులుండినను జెవుడు పృథివిస్థలితో
జనపతుల కిది స్వభావ
మ్మనుమాట నిజంబు భూసురాన్వయతిలకా !

వ॥ "ఆడంబరాని పూజ్యాని" అన్నట్లు డంబముగలవారు గదా సభాపూజ్యు లగుదురు.

తో॥ తనువున మాంసచులే ఈ నగలు వస్త్రములైన గానరావు
గనుక హరివలన తగుగౌరవ మే కరణిని బొందెద వీవు.

వ॥ ఈరీతి పరమభాగవత శిఖామణిని పరిహసింప, నందున సత్పురుషుం డొకడు లేచి వారల గోపించి మూర్ఖులారా!

మ॥ పరకాంతాపరతాది దుర్వ్యసనముల్ భావింప కెవ్వేళ నీ
ధరలో దా మొనరించు కర్మఫలముల్ దైత్యారి కర్పించుచుం
బరమాత్మన్భజియించు దాసులకు దుర్వ్యాపారముల్ చేయుచు
న్గరువంబుం గొని సంచరించు ధరణీనాథాగ్రిణు ల్వారటియే.

వ॥ పామరులారా! 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అను వాక్యమును వినలేదా? దేహాభిమానము గలవారు వస్త్రాభరణాదులు ధరించెదరు. సర్వసంగపరిత్యాగులగు భాగవతుల కవేల? వీరలకు నారలే చీరలు. తులసీహారములే మణిహారములు. హరినామ సంకీర్తనమే ధనము. కావున నిట్టి –

పూరి—త్రిశ్రగతి.

దాసులసేవ కల్గిన ముక్తికి త్రోవ హరి ॥దాసు॥
భాసుర వేదపదోప|న్యాసులు సన్యాసు లగు ॥దాసు॥
పరదారాధాన్య | భ్రాంతులుమాని
నిరతము శ్రీహరినామ | స్మరణము బూనిన ॥దాసు॥

వ॥ కావున నిట్టి పరమభాగవతుల దూషించిన కీడు సంభవింపక మానదు. సత్వరముగా పోయి వాసుదేవునితో నీ మహానుభావుని రాక నెఱింగింపుడన వల్లెయని యొక ద్వారపాలకుడు బిరాన నేగి వీరభటులచే బాలింపబడియున్న డెబ్బదిరెండు వాకిండ్లు గడచి శ్రీహరికి తన రాక నెఱింగించి తదాజ్ఞ వడసి లోపల బ్రవేశించి గోవిందుని గాంచి,

శంకరాభరణం—త్రిశ్రగతి.

సుందరతాజితమార ! | సూరిలోకమందార !
నందవరకుమార ! | నమో నమో నమో ! ॥సుంద॥

నాగాంతక హయా! శ్రీజనార్దన సద్గుణనిచయ
సాగరకన్యాప్రియా! । జయా జయా జయా ॥నందు॥

వజ్రినారీహృచ్చోరా! । వృజనారణ్యకుఠారా
సుజనహృద్విహారా! । జోహార్ జోహార్ జోహార్ ॥నంద॥

శిక్షితదైత్యస్తోమా! । జీమూతగణశ్యామా!
రక్షితబాలాజీనామా । రామ్ రామ్ రామ్ ॥నంద॥

వ॥ ఇట్లు, వినుతించి, దేవా!

క॥ ఆతం డొక బ్రాహ్మణు డట
నీతో బాల్యమున విద్యనేర్చుకొనిన సం
గాతి యట కుచేలుండట
యాతని నామంబు యదుకులాంబుధి చంద్రా!

తో॥ అమ్మహిసురుడు విన్నవింపు మన ♦ నరుదెంచితి గుణధామా!
పిమ్మట మీ చిత్తం బాతని ♦ భా♦గ్యమ్మ నీరదశ్యామా!

వ॥ ఈ తెఱంగున కుచేలుని రాక నివేదించిన వాసుదేవుండు
విని చెప్పనలవిగాని సంతసమున.

కాఫీ—త్రిశ్రగతి.

త్వరగ నేగుమ సేవకా! ॥త్వర॥
పరమభక్తు డతండు విప్రవంశపావనుండు ॥త్వర॥
విను మాతని కెనరా రల । మనుజాధిపు లెవరైనను
గనుక నా మనమున వాని । గన నపేక్ష గలదుగాన
జనుము రమ్మనుము । కిడతకతోం కిడతకతోం ॥త్వర॥

వ॥ ఇట్లానతీయ ద్వారపాలకుండు బిరానవచ్చి కుచేలుని గని.

ధన్యాసి—ఆటతాళము.

ఇంత పుణ్యపురుషుండ వే వనుచు । నెఱుగనైతి నార్య ॥యిం॥

అంతరంగమున సామాన్యుడ వీ । వనుకొంటిని భూసురకులవర్యా॥
కమలాక్షుని సేవింప ననేక । క్ష్మాపతు లరుదేర లక్ష్మీ
రమణుడు దర్శన మీయమిచే ద్వా।రమున నిలిచియున్నా రదిగో గను॥
ఎట్టితపము జేసియుంటివో హరి । కెట్టిమిత్రుండవో యిటకు వచ్చి
నట్టుల విని పట్టరానిముదమున । నెట్టనదోడ్కొని రమ్మని వచించె॥
శరదముగన్న మయూరముభాతిని । చంద్రునిగన్న చకోరముగతి మీ
రరుదెంచుట విని బాలాజీవరదుం। డానంద సాగరమున మునింగె ॥నింత॥

వ॥ దయచేయు డని వేడ నాబ్రాహ్మణుండు కడుసంతసమున శ్రీకృష్ణసౌధంబున బ్రవేశించి చనుచు.

పూరి — చతురశ్రగతి.

ఎంతో ముద్దు । ఎంతో సొగసు ॥యెం॥
వింతదోచె గో।విందుని భవన ॥యెంతో॥
స్ఫటికపుగోడల । పైనా నీడల
స్ఫుటతరముగ । జూపట్టుచున్నవి
ఘటరథహరిఘో।టకములు చిత్రించిన
పటములు తుద గను।పట్టుచున్నవి
ఘటికలు దెలిపెడి । గడియారమ్ములు
జటినైనగాని । విటుచేయుబొమ్మలు
దిటవగు బంగరు మంచము కుర్చీ
లటుమీద పట్టుపరుపు లమర్చి ॥రెంతో॥

వ॥ శ్రీకృష్ణుని మందిరవైభవంబు నాలోకించి మిగుల నాశ్చర్యమంది ముందుకు జనిచని.

సీ॥ బింబోష్ఠులిర్వురు వింజామరులువీవ, పడతియొక్కతె యాకుమడుపు
లిడగ । నెరజాణయొక్కతె నిల్వుటద్దముజూప, నంబుజాననలిద్దరడు
గులొత్త।పూబోణియొక్కతె పూలదండలువేయ, తరళాక్షియొకతె
చందవముబూయ । నీలవేణియొకర్తె నివ్వాళులనొసంగ, తరుణి
యొకర్తె హెచ్చరికసేయ ।

గీ॥ మగువ రుక్మిణి తొడలపై మస్తకంబు
సత్యభామోరువులమీద చరణయుగము
నుంచి యానందమున బవ్వళించియున్న
వాసుదేవుని జూచి యాభూసురుండు॥

కల్యాణి - చతురశ్రగతి.

ఆడసాగె నానందనృత్య మవనీదేవు ॥డాడ॥

తాడితదైత్యవ్యూహుఁ సు|ధాపయోరాశిగేహుఁ
నీడోద్భవరాడ్వాహుఁ కమనీయాంబుధ సమదేహు న్గని ॥యాడ॥

వ॥ ఇట్లానందనృత్యము సల్పుచుండ కృష్ణుండుచూచి తల్పంబు డిగి కడుప్రేమ నెదురేగి.

శ్రీరాగం - రూపకము.

ఆదరించె నల కుచేలుని శ్రీవాసుదేవు ॥డాద॥

యాదవకులపావనుండు | రాధామానసహరుండు ॥ఆద॥
ఎదురుగ జని దర్శించి | పదములకు నమస్కరించి
పిదప నతని కౌగలించి | పీఠముననుండ నియమించి ॥ఆద॥

పన్నీర్నెమ్మెనబోసి | పరిమళద్రవ్యములు పూసి
యన్నాదులసేవించి | యర్హాతల్పమున నుంచి ॥ఆద॥

తోడి - రూపకము.

అడుగుదమ్ములొత్తె ననుంగుచెలికాడైన కుచేలుని ॥యదు॥

పుడమివేల్పు బడలికలూడ గొల్ల | పడతులెల్ల వింతగజూడ నల పా
రుడు కోరదలచినకోరిక చేకూర పాల్కడలియల్లుండు
కడుసంతసముతోడ ॥నడు॥

హరవిరించిసురముఖ స|మర్చితపదపంకజుండు
ద్విరదరాజశుభకరుండు | బీ. బాలాజీవరదుండు ॥అడు॥

వ॥ ఇట్లు గావింప దీపమును సమీపించిన కర్పూరము పోల్కి కుచేలుని హృదయము కృష్ణునియందుంచి పరవశుడయ్యె.

సీ॥ కడుదృప్తినొందె శ్రీకౌస్తుభాంకుఁ బ్రీతి, నిడినరుచ్యముల జిహ్వాం ద్రియమ్ము । సంతసంబందె కంసవిరోధి నెమ్మేని, ఛాయలంజూచి లోచనయుగమ్ము । ఆనందమొందె శ్రీవ్యాదమర్దను భాషణము లాలకించి కర్ణద్వయమ్ము।తనివి తాజెందె మాధవు పుష్పమాలికా సౌరభ్యమంది నాసాపుటమ్ము,

గీ॥ లతిపవిత్రత నొందె బ్రాహ్మణునితనువు
పార్థసారథి మృదుకరస్పర్శనమున
బడలికలువాయ శయ్యపై బవ్వళించి
కూర్కులో జొక్కె పారుండు కొంతసేపు.

వ॥ ఇట్లు నిద్రజెంది కొంతసేపటికిలేచిన కుచేలుని గోపాలుం డాలోకించి స్వామీ! మీసందర్శనమున నాజన్మము సఫలమయ్యెను. నాగృహము పవిత్రమయ్యెను. మన బాల్యస్నేహ మారసినను జ్ఞప్తికి దెచ్చుకొనుచున్నారా? నేను మీక్షేమము లప్పుడప్పుడు విచారింపు చుందు. అడవియుసిరికకాయకు నంబుధిలవణమునకు సంబంధముకలిగి నట్టు కడుదవ్వుననున్న మీరు నేను నేటికి చూచుకొననయ్యె, నది యట్లుండనిండు. మీకు పెండ్లియైనదా? బిడ్డలుకలిగినారా? అన్న పానాదు లనుకూలముగ నున్నవా? మీయిల్లాలు మీమాటదాటక వర్తించుచున్నదా? మీకు స్నానసంధ్యా జపతపోనుష్ఠానాదులు కొరత లేకుండ జరుపుచున్నారా? మనము చిన్ననాడు సాందీపునియొద్దచదువు నప్పుడు జరిగినసుద్దులు జ్ఞాపకమున్నదా?

జంఝూటి - రూపకము.

యాదియు న్మదిలేద పిన్ననాటి సుద్దులు ॥యాది॥
మోదముతో నలసాం।దీపునిచెంత జదువునపుడు
భోదరిమెకదా యింధన । ములకు మనల వనికి గురుసతి ॥యాది॥

గరితమిన్న యాజ్ఞబూని । యిరుపురము న్వీపినభూమి
కరిగి వంటచెఱకులను । శిరమున నెత్తుకొనివచ్చు
తరిని వానగురియ నందు । దడసి మార్గమును గానక
తిరుగుచుండ బాలాజీ । వరదుని భక్తుండగు మన
గురువు మనల దోడ్కొని చని । పరమసాధ్వి పై గోపము
బరపలేదె మనల వనికి । బంపినందు కై నాడు ॥యాది॥

వ॥ ఇట్లు క్షేమం బారసి మిత్రమా! బహుకాలంబునకు మీ సందర్శన మాయెనుగదా. నానిమిత్తమేమి దెచ్చితి వన కుచేలుం డావాసుదేవుని గాంచి,

శ్లో॥ రత్నాకర స్తవ గృహం గృహిణీచ పద్మా
కిందేయ మస్తిభవతే పురుషోత్తమాయ
ఆభీర వామనయనాహృత మానసాయ
దత్తం మనో యదుపతే త్వరితం గృహాణ.

వ॥ ఇట్లని కుచేలుండు సంశయించుచు తనయుత్తరీయమునుండి మూటవిప్పి పిడికెడటుకుల నొసంగ కృష్ణుండునవ్వి పెన్నిధానముగను గొన్న పేదవలె పూర్ణానందుండై.

తోడి - రూపకము.

ఆరగించినాడు కృష్ణుడు రిపుజనజిష్ణుడు ॥ఆర॥
ధీరుడు వల్లవబాలికా । జారుడు నవనీతచోరుడు
అల శబరియిచ్చిన పం।డులు మెక్కినరీతి
గులుకుచు హనుమంతునితో । గుడిచినభాతి
జెలువుగ విదురునింట భు।జించినగతి బ్రీతి
జెలికాడగు కు।చేలు డిచ్చిన యటుకులు పిడికెడు ॥ఆర॥

వ॥ అన్నమునకు నీళ్ళకు వేసారిన నిరుపేద కమృతము లభించిన నెంతయానందించునో యట్లువాసుదేవుండు పిడికెడటుకులందిని రెండవ

పిడికెడు తినబోవు సమయమున రుక్మిణీదేవి మొదటి పిడికె డారగించి నప్పుడే కుచేలునికి సకలసంపద లొనగూడునట్లు దలంచి రెండవ పిడికెడు భుజించినచో చాలకాలము కుచేలునకు శ్రీహరి భృత్యుడుగా నుండవలసివచ్చునని భర్త హితముగోరి చేయిపట్టుకొన నా సంగతి గోపాలుం డెరింగి నవ్వి యూరకుండె. నంత నొకనాడు సంగడికాం డ్రిద్దరు వనవిహారముసేయ నేగి యొక వ్రిమదావనమున ప్రవేశించి విహరింపుచున్న తఱి నొక మామిడిచెట్టుమీదనున్న కాకులపిండులో, కోయిలయుంట నెఱింగి తాను దరిద్ర్యాపేక్షతో వచ్చినట్టుల కృష్ణుని తో తేటగా చెప్పుటకు మనంబొప్పక అన్యాపదేశముగా వెల్లడించు నుద్దేశముతో పికరాజము నాలోకించి.

శ్లో॥ రేరే కోకిల మాభజమౌనం । కించి దుదంచయ పంచమరాగ ।
నోచేత్త్వామిహకో జానీతే। కాకకదంబక విహితే చూతే.

వ॥ ఇట్లు కుచేలుం డన సర్వజ్ఞుండగు వాసుదేవుం డంతరంగమున నవ్వుకొని యేమియు నెఱుంగని వాసకై వడి నూరకుండి యింటికివచ్చి కుచేలు నాలోకించి బ్రాహ్మణోత్తమా! మీ రిచ్చటి కరుదెంచి చాలాదినములైనది. మీ కొరకు మీ యాలుబిడ్డ లెదురుచూచు చుందురు. గాన నిజమందిరం బలంకరింపు డని సెలవీయ నా భక్తాగ్రి గణ్యుండు హరిసందర్శనమే మిగుల లాభకర మని అంతములేని సంతస మున మరలివచ్చుచుండ గోపాంగన లాలోకించి తమలో దాము.

ముఖారి — ఆదితాళము.

వామాక్షి! వినవే యెంతటి । వాడే గోపాలుం
డే మీకుండ నెచ్చెలికాని । నింటికి బొమ్మనియె ॥వామా॥

ముద్దుకృష్ణు డెంతో గౌరవము । మొదట జేసినపుడు
హద్దులేని ద్రవ్య మితని కిడునని । యనుకొంటిమి సుమ్మి ॥వామా॥

డంబముగలవారు భూపతుల । డాయ నాదరింతురి
కంబుకంఠి బీదవారలను । కడకంటనైన గనరు ॥వామా॥

తేటతెల్లమయ్యె హరిదయ భూ। దేవుని గాచుటలో
బోటిమిన్న! ముంజేతికంకణము। జూడనద్దమేల ॥వామా॥
చెలియా! లాభించుననివ। చ్చినా డింతదూర
మల కొండద్రివ్వి యెలుకను గొనినట్లయ్యె నిసనిబ్రతుకు ॥వామా॥
పరమాత్ముని మిత్రుండయ్యె బాపడు కుచేలుడయ్యె
నరయ రాజు మగడైన గాజుకడియమే గతియనునట్లు ॥వామా॥

వ॥ ఇట్లనుకొనుచుండ నందు వృద్ధ గోపిక లేచి వారలజూచి మనకేందు కీ యనవసరపు ప్రసంగము? గోవిందుని బూటకములు కుచేలుని మహిమ లెవరెరుంగగల రని వారల మందలించి యిండ్లకు బొమ్మన వా రట్లు పోయిరి. పిమ్మట కుచేలుండు నడుదారివచ్చునెడ.

సీ॥ ఉపవాసముల స్రుక్కియున్నట్టిదేహము, పొలసునల్లలతోడ బూర్ణ
మయ్యె। గళసీమదాల్చిన నలినాక్షమాలిక, వ్వెలలేని ముత్యాల
పేరులయ్యె। తనవ్రేలబెట్టిన దర్భాంగుళీయక, మురురత్నముల
ముద్దుటుంగ్రమయ్యె। చిక్కినమేనదాల్చిన జీర్ణవస్త్రము, విలువ
జల్తారు దువ్వలువయయ్యె।

గీ॥ వికృతరూపంబుపోయి నవీనమారు
డనగదగినట్టి సౌందర్య మతనికబ్బె
హరిని దర్శించి ద్వారకాపురమువిడచి
హెచ్చరికతోడ నింటికే వచ్చునపుడు॥

వ॥ అంత నాబాపండు కడుసంతసమున వచ్చి సమస్తభాగ్యములతో తులతూగుచున్న మునిపల్లెనుం గాంచి విస్మయమొందుచుండ నందు గృహస్థులంద రెదురేగి తగు గౌరవమున తోడ్కొనిరాగ కుచేలుని భార్యయగు సుశీల సకల భూషాణాలంకృతురాలయి.

ఆనందభైరవి — త్రిశ్రగతి.

ఎదురుగవచ్చె నామదవతి సన్నుత నియతి ॥యె॥
పదుగురుచెలికత్తెలు కడు। ముదమున వెన్నంటిరాగ ॥యె॥

సదమలభక్తితోడ నా । సాధ్వీమణి హృదయేశున ॥కెదు॥
అబ్బురమగు నగలు పెట్టి । మబ్బురంగు చీరగట్టి
దబ్బున నిర్మలజలపాత్రిను పళ్ళెరమునుబట్టి ॥యెదు॥
నగధరుడగు కృష్ణుని సన్మానమంది మరలివచ్చు
మగని పాదయుగ్మమును గడిగి తోడ్కొనిచనుటకునై ॥యె॥

వ॥ వచ్చి భర్త పాదమ్ముల పసిడిపళ్ళెరమున నిడి శుద్ధోదకముచే గడిగి పైటకొంగున దడినొత్తి షడ్రసాన్నంబుల నిడి చూడ వచ్చినవారి యిండ్లకు బనిచి తనపురుషుని షోడశోపచారముల నానందింపజేసి యతని నాసంగతులు తెలిపికొన నూహించి,

## ——♦ సుశీల సంవాదము ♦——

హిం॥ భైరవి - త్రిశ్రిగతి.

సు:—వింత లేమి యోప్రియా!
కంతుగురుని జూడ ద్వారకా నగరికి బోవునప్పు
డెంతటి శ్రమపడియుంటిరో । యెరిగింపుడు క్షమించి ॥వింత॥

కు:—ఏమిచెప్పుదునే సఖి!
భామా! నడిదారిలో గడు । బాధలు వాటిల్లె దాని
కేమిగాని నేటికి నీ । యాప్సితమీడేరె గదా ॥యే॥

సీ॥ వనజాక్షు మందిరద్వారంబు దరిజేర, కావలివారు నన్నాంచినారు
నను జూచి పకపకనవ్వుచు నాయొద్ద, జేరి నన్నెగతాళి జేసినారు
వారిలో నిర్వురుభటులు నావృత్తాంత, మంతయు సంప్రీతినడిగినారు
అడిగి సౌధములోని కరిగి నాస్థితి వాసు, దేవునితో నివేదించినారు

గీ॥ విస్మయంతనె గృష్ణుండు నన్ను బిలచి
హద్దులేని గౌరవము సమాచరించె
కొన్నినాళ్ళుండి పిమ్మట గోత్రధరుని
సెలవడిగి వచ్చినాడనో కలికిమిన్న!

వ॥ ఇట్లు బ్రాహ్మణుండు చెప్పి కొంతకాలము సతీసుత సమన్వితుండై సకలసౌఖ్యంబు లనుభవించి హరినిభావించి.

హిం॥ భైరవి – ఆదితాళము.

1 దేవా! రావా నన్ను గావ దేవ ॥దేవా॥

2 భావజజనక! పాలితసనక!
నీవె దిక్కని మది। నిన్ను నమ్మితి గనక ॥దేవా॥

3 పిల్లలకు పప్పు। బెల్లముల నిచ్చి
అల్లరులమాన్పి। సట్టుల నాకిప్పు
డెల్ల సంపదల। నిచ్చితివి ఎంతో
సిల్లితి బీ. బాలాజీ బాలగోపాల ॥దేవా॥

వ॥ ఈ తెఱంగున గుచేలుండు ప్రార్థింప గృష్ణుండు ప్రసన్నుండై

ఉ॥ మెచ్చితి నీ ప్రపత్తిని మేదినిలోపల గొంతకాలముఁ
మచ్చికతోడ బిడ్డలకు మానినికి న్మరి భృత్యకోటికిఁ
ముచ్చటదీర్చి మాపయిని ముక్తిపదం బొనగూడునంచు నా
లచ్చిమగండుదెల్పి చన లాలన మొప్ప గుచేలు డాసతిఁ.

తో॥ కాలముదోయుచు గొన్నాళ్ళకు శ్రీ కాంతుని సత్కృపచేతఁ
మేలయిన చిదానందపదవి భూమీసురు డందెను బ్రీతిఁ
ముదమున నీచరితము వినువారలు భూలోకసుఖం బంది
తుద నివసింతురు వైకుంఠమున తోయజాక్షు కృపనొంది.

స మా ప్త ము.

మం గ ళ మ్ మ హ త్.



## —♦ ఆంధ్రనాటకములు ♦—

| | |
|---|---|
| రసపుత్రవిజయము ఇ॥ య॥ | 1_0_0 |
| రాణాప్రతాప్‌సింగు డిటో | 1_0_0 |
| సంపూర్ణభారతము బళ్ళారి పండిత కె॥ సు॥ | 1_0_0 |
| శోషనార బ॥ కో॥ | 0_8_0 |
| శ్రీకృష్ణరాయభాగము | 0_8_0 |
| సంపూర్ణరామాయణము | 1_0_0 |
| శ్రీరామాంజనేయము పి॥ చి॥ | 1_0_0 |
| మహానంద ద్రో॥ శీ॥ | 0_8_0 |
| సారంగధర కో॥ గో॥ | 0_8_0 |
| చండిక ము॥ వెం॥ | 1_0_0 |
| కుశలవ జ॥ ల॥ | 0_8_0 |
| సతీఅనసూయ సో॥ రా॥ | 1_0_0 |
| ప్రతాపరుద్రీయము | 1_0_0 |
| అలీబాబా 40 దొంగలు | 0_12_0 |
| తాజ్ మహాల్ (జహానారా) | 1_0_0 |
| రణికోట (రెడ్డప్రతాపము) | 1_4_0 |
| పార్వతీగర్వభంగమను గంగావతరణము | 1_0_0 |
| గోజకాళిదాసు | 1_0_0 |
| సంగీతశశిరేఖ | 0_8_0 |
| భక్తకబీర్ కో॥ స॥ | 0_8_0 |
| పాదుకాపట్టాభిషేకము | 0_8_0 |
| శాంతామతి బ॥ కో॥ | 0_8_0 |
| ధ్రువవివాహము గో॥ వెం॥ | 0_8_0 |
| రాధాకృష్ణలీల కం॥ వే॥ | 0_8_0 |
| ధ్రువలీల మ॥ అ॥ | 0_12_0 |
| సంగీతసావిత్రి చె॥ వేం॥ | 0_8_0 |
| రామదాసు గా॥ సూ॥ | 0_8_0 |
| పద్మవ్యూహము మ॥ న॥ | 0_8_0 |
| చకతార ము॥ చం॥ | 0_8_0 |
| ప్రమతీదేవి శ్రీ॥ తి॥ | 1_0_0 |

## —♦ నవలలు ♦—

| | |
|---|---|
| వనదుర్గను | 1_0_0 |
| తపోవనము | 1_0_0 |
| జపమాలిక పా I, II | 2_0_0 |
| శిశుహత్య పా I | 1_0_0 |
| శిశుహత్య పా II | 1_0_0 |
| శిశుహత్య పా III | 1_0_0 |
| ఇందిర | 0_12_0 |
| యమదూత | 1_0_0 |
| మండ్రిగబ్బ పా I | 0_12_0 |
| డిటో పా II | 0_12_0 |
| గజదొంగ | 0_12_0 |

## —♦ స్త్రీల పాటలు ♦—

| | |
|---|---|
| ఘూలి సుబ్బారావు పాటలు | 0_12_0 |
| డిటో రెండవభాగము | 0_12_0 |
| వేడుకపెండ్లిపాటలు | 0_8_0 |
| మహిళామనోరంజిని | 0_5_0 |
| అధ్యాత్మరామాయణం | 0_8_0 |

## —♦ వైద్యగ్రంథములు ♦—

| | |
|---|---|
| గృహవైద్యచికిత్సారత్నము 1 భా | 1_0_0 |
| డిటో రెండవభాగము | 1_0_0 |
| వైద్యరహస్యదీపిక | 0_8_0 |
| సహదేవపశువైద్యము | 0_6_0 |
| వస్తుగుణప్రదీపిక | 3_0_0 |

## —♦ ప్రబంధములు ♦—

| | |
|---|---|
| భాగవతరత్నములు | 0_8_0 |
| వేమనరత్నములు | 0_8_0 |
| సమయోచిత పద్యరత్నావళి | 0_6_0 |
| భగవద్గీత (పద్యకావ్యము) | 1_0_0 |
| దండకరత్నము 20 దండకములు | 0_6_0 |
| కబీరుదాసు హరికథ బా॥ నా॥ | 1_0_0 |

లయువారు :—కురుకూరి సుబ్బారావు & సన్,

ప్రొప్రయిటర్సు :—సరస్వతీ బుక్ డిపో, బెజవాడ, కృష్ణాజిల్లా.